Regd No. N. 45 / M. 3813

102618

వెల ఒక అణా

గోలకొండ డైరీ
అయిపోవచ్చినది
వెల ౧ రూపాయి

# గోలకొండపత్రిక

ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

హిందువుల పండుగలు
కర్త సు. ప్రతాపరెడ్డి
౩౦౦ పుటల గ్రంథము వెల ౧ రూపాయి మాత్రమే.
మేనేజరు గోలకొండపత్రిక

సంపుటము ౧౯ ★ హైద్రాబాదు, దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషసం॥ర కార్తీక శు॥ ౧౫ (౨౭-౧-౧౩౫౧ఫ.) సోమవారము ★ సంచిక ౫౦

## ఖార్ఖోవును రష్యాసేనలు ఖాళీచేయుట

### క్రిమియాదుర్గములను జర్మనులు భేదించిరట

ఓరియల్ వద్ద రష్యాసేనలు వెనుకకు త్రోయబడినవి

రష్యాజర్మనీల యుద్ధమునుగురించి అక్టోబరు ౨౪వ తేదినుండి ౨౬వ తేదివరకు వచ్చినవార్తలలో మూడుఅంశములు తక్కినవాటికంటె ముఖ్యతరములైనవి. ఒకటియుక్రెయినురంగములో ఖార్ఖోవుఅను పెద్దపారిశ్రామికపట్టణమును రష్యాసేనలు ఖాళీచేసిపోయినవనునది. రెండవదిజర్మనుసేనలు పెరికోపుభూసంధినిదాటి క్రిమియాలో ప్రవేశించిరనునది. మూడవది మాస్కోకుదక్షిణమున ఓరెల్ నుండితూలాకు జర్మనులు కొంతముందుకు పోయి కొంతప్రదేశము నాక్రమించుకొనిరనియు, ఇప్పుడుఆవైపున యుద్ధము తీవ్రతరమయినదనియు రష్యను ఒప్పుకొనినసంగతి.

మొత్తము మీదచూచినచో యుక్రెయినులో జర్మనులకు ఎక్కువవిజయములు కలుగుచున్నట్లు కనిపించును. ఇక్కడజర్మనులు ఖార్ఖోవునుపట్టుకొన్నతర్వాత డోనెట్జుప్రాంతములో నుండు క్రామటోర్స్కాయాలోకి అక్టోబరు ౨౪వ తేది నచొరబడిరని జర్మనుఅధికారులప్రకటనలో తెలుపబడినది. ఇప్పుడు రాస్టోవుదుర్గములవద్ద యుద్ధము జరుగుచున్నది. ఇదిడోనునది ముఖద్వారమునద్దనుండు పెద్దరేవుపట్టణము. డోనెట్జు ప్రాంతమందు వాయవ్యదిశనజర్మనుసేనలు మాకియేవకా అనుపట్టణమునకు తూర్పునున్న రష్యావారిదుర్గములనుకొద్దిగా భేదించిరికాని అటుపైనఇకను ఎక్కువ భేదించకుండ రష్యనుసేనలు నిరోధించగలిగినవి. రోస్టోవునగరమువద్దజర్మనులు ఆక్రమించ కలిగినస్థానములలో ఆనేకములను రష్యావారు పునరాక్రమించిరికూడనన్నారు. రోస్టోవునగరముపైన విమానములపోరాటములు ఘోరముగా జరుగుచున్నవి. రోస్టోవునగరము రష్యాలోని ఉత్తరకాకేసస్ రాష్ట్రముయొక్క పరిపాలనాకేంద్రము.

క్రిమియాదుర్గములలో జర్మనుసేనలు అడుగుపెట్టగలిగినట్లు అక్టోబరు౨౫వతేదిన మాస్కోరేడియోలో ఒప్పుకొనబడినది. ఇదినిజమైనచో రష్యావారలకు ముందురెండుఉపద్రవములవల్ల భయముండును. మొదటిదిఏమనగా, సెబాస్టోపోల్ వద్దరష్యావారి నౌకలమూలస్థానమును నాశనము చేయుపని జర్మనులకుసులభమగును ఇందువల్ల సముద్రమునుండి కదలితొప్పి, నోవోరసిస్క్, బాటూం అనుచిన్నచిన్నరేవుల నాశ్రయించు కొనవలసియుండును. రెండవదిఏమనగా, క్రిమియాఅంతటిని ఆక్రమించినజర్మనులు కెర్చిద్వారా కాకేసస్ ప్రాంతమును దక్షిణదిశనుండి రోస్టోవుకొట్టవీలగును.

ఇకమాస్కోరంగము. పోయిన అష్టాహముల ప్రారంభమందు జర్మనుసేనలు మాస్కోనగరమునకు దక్షిణమునకు, నైఋతమున కొంతదూరము ముందుకుపోగలిగిరి. మాస్కోనైఋతమున ౭౦ మైళ్లదూరములో నారాఅనునదినిజర్మనులు ఇంకను దాటలేదన్నారు. దక్షిణమున ౬౦మైళ్లదూరమున ఓకానదినికూడజర్మనుసేనలు ఇంకను దాటలేకయున్నవి. అంతేకాదు, ఈదక్షిణములోమాలోయారోస్లావెట్జైవైపునకు రష్యాసేనలు కొంతదూరముపోయి జర్మనులనుండి కొన్నిస్థలములను తిరిగిసంపాదించుకొనగలిగిరి. ఇప్పుడురష్యావారలు వాటిలోఒకదానిని పునరాక్రమించగలిగినను అక్కడరష్యావారిపరిస్థితి భయపడదగినట్లేయున్నది. కాలినిను పట్టణమంతయుపాడైనదిగాని అక్కడిజర్మనుసేనలు ఇంకనుముందుకునడువకుండ రష్యాసేనలు ప్రతిఘటించుచున్నవి. ఓరెల్ నుండి తూలాకుపోవుచున్న జర్మనుసేనలుకూడ ముందుకుసాగగలిగినట్లు, ఇప్పుడుఅక్కడస్థితికూడ రష్యావారలకు భయపడదగినదిగానేయున్నట్లును ఒకరష్యాపత్రికయొక్క విలేఖరి అపత్రికకు తెలిపినాడు. మాస్కోనగరమును చేరుటకై జర్మనుసేనలునడుచుచున్న తక్కిన ప్రాంతములలో రష్యాసేనలు జర్మనులుపట్టుకొనియున్నస్థానములను తిరిగిపట్టుకొనుటకైయత్నించుచున్నవి. మాస్కోకు ౬౫మైళ్ళదూరమున పడమటమొజెయిస్కుప్రాంతమున "డి" అనుసంకేతముగల ఒకస్థానముయొక్క తూర్పుభాగమును రష్యాసేనలు జర్మనులనుండి పునరాక్రమించినవి. అక్టోబరు ౨౫వ తేదిన మొదటిసారిగా మాస్కోకువాయవ్యదిశన ౬౦మైళ్ళదూరములో రెఫూవుకుపోవుమార్గమునందు వోలోకోలాంస్కుఅనుస్థానమువద్ద జర్మనులుకొత్తపోటును ప్రారంభించి అనేకములైన జనావాసములను ఆక్రమించగలిగిరి అట్టి రష్యాసేనలు 'బి' అను ఒక స్థానమును సమీపించి దానితూర్పుప్రదేశమును పునరాక్రమించినట్లు అక్టోబరు౨౫వ తేదినాటి మాస్కోరేడియోవార్తలో నున్నది. అక్టోబరు౨౬వ తేదిన వోలోకోలాంస్కు, మొజెయిస్కు, మాలోయారోస్లావెట్జు, తూలావైపులలో ఉభయపక్షసేనలకును చాలఘోరములైన పోరాటములుజరిగినవి.

ఇప్పుడుమాస్కోనగరముపై జర్మనువిమానాలపోటులుచాలవిజృంభించినట్లు రష్యనులుచెప్పుచున్నారు. అట్టిపోటులన్నిటిలోను చాలగొప్పదైనపోటు అక్టోబరు ౨౫వ తేదినజరిగినది.

ఇప్పుడుమాస్కోవద్దికి జర్మనుసేనలుఇంకను ఎక్కువగా పంపబడుచున్నవి. రుమేనియనులు ఇందుఎక్కువగానున్నారు.

లెనిన్గ్రాడురంగమందు రష్యాసేనలు ముందుకుపోయి జర్మనులుపట్టుకొనగలిగినట్లు రష్యాప్రభుత్వమువారి ప్రకటించిన ప్రకటనలలోనున్నది. ఒక్కచోటమాత్రము జర్మనులురష్యాసేనలనువెనుకకుపెట్టివేసినవట.

రెండుఫిన్లెండుజాతిమోటారు టార్పెడోనౌకలు ఫిన్లెండుసముద్రములోరెండురష్యావారిడిస్ట్రాయరునౌకలనుముంచివేసినవట.

అక్టోబరు ౨౫,౨౬ తేదులలో రాత్రులందురష్యావారివిమానములు బర్లినునగరము మీదికిపోయి అక్కడిసైనికస్థానాలమీదను, పరిశ్రమలుండుచోటులమీదను బాంబులువేసినట్లు రష్యావారు ప్రకటించినారు.

### ఫ్రాన్సులో జర్మనుల క్రూరప్రతిక్రియలు

ఫ్రాన్సులో జర్మను లాక్రమించియున్న భాగమందు ఫ్రెంచిజనులు అక్కడిజర్మనుఅధికారులను నిర్లక్ష్యముచేయుచున్నట్లును, కొందరుజర్మనుఅధికారులను చంపుటకుయత్నములు చేయుచుండినట్లును ఇదివరలోచూచియుంటిమి. ఇట్టిఆగ్రహావేశక్రియలన్నియు రష్యాపైజర్మనులు యుద్ధముప్రారంభించినతర్వాత ఫ్రాన్సునందు [illegible] ఈసందర్భములలో ఏపాపమెరుగని ఇతర ఫ్రెంచిజనులను బాధితులైన ఒకొక్క జర్మనుఅధికారికి ఒకసంఖ్యకంటెమించిన ఫ్రెంచిజనులను తీవ్రముగాశిక్షించుటకు మొదలిడిరి. కొందరుజర్మనులు ఫ్రెంచివారలనువర్గములుగా పట్టుకొని తుపాకులతో కాల్చిచంపువిధానమునుకూడఅవలంబించిరి. నాంటీసులోను, బోర్డియోలోను ఈవిధముగా ఇద్దరుజర్మనుఅధికారులు చంపబడినందుకు అట్లుచంపినవారలను పట్టియివ్వనిచో కొందరుఫ్రెంచివారలను చంపెదమని చెప్పిచంపివేసిరి. ఇంకను మరికొందరుఫ్రెంచివారలను చంపనుండగా ఫ్రెంచి ప్రభుత్వప్రధానియగు మార్షల్ పెటెయినుగారు తనకుఅట్టిప్రతిక్రియకు గురియగువారలలోచేర్పవలసినదనికోరినట్లు ఒకవాదుకఅనుకొనబడుచున్నది. పెటెయినుగారును ఉపప్రధాని డార్లనుగారును ఫ్రెంచిజనులు ఇటువంటిదౌర్జన్యములనుమాని ఇంతవరకుదౌర్జన్యముచేసినవారలను జర్మనుఅధికారులకు పట్టియివ్వవలసినదని విన్నవించిరి. స్వతంత్రఫ్రెంచి జాతీయనాయకుడగు డీగాల్ గారుకూడ ఇటువంటిచిల్లరఅల్లరులు మంచివికావనియు సరియైనపద్ధతిపై జర్మనులపై చర్యగైకొనుటకు తగినకాలమునుతాను తెలిపినంతవరకు ఓర్పువహించియుండవలెననియు ఫ్రెంచిప్రజలకొకవిజ్ఞప్తిచేసిరి.

ఈవిజ్ఞప్తుల తర్వాతజర్మనుఅధికారులు ఇంకను మరణదండనపాత్రులనుగా నిర్ణయించినఫ్రెంచిజనులను నాంటీసులోనివారిని అక్టోబరు ౨౪వ తేది అర్ధరాత్రివరకును, బోర్డియోలోని వారలను అక్టోబరు ౨౬వ తేదిఅర్ధరాత్రివరకును జీవించియుండనిచ్చెదమనియు, ఈలోగా జర్మనుఅధికారుల నిరువురినీచంపిన ఫ్రెంచిదోషులనుపట్టియివ్వవలెననియు ఆజ్ఞాపించిరి మరియుబోర్డియోచుట్టుపట్టులవారలందరును అక్టోబరు ౨౮ వతేదిసాయంకాలము ౬గంటలలోగా ఒకకోటిఫ్రాంకు నాణెములను జుల్మానాగాచెల్లించవలెనని ఆజ్ఞాపించిరి. ఇప్పుడు నాంటీసులోను బోర్డియోలో జర్మనుఅధికారుల హత్యాకారకులు చిక్కనిపక్షమున, మరొకసారి ఇట్టిదౌర్జన్యములు జరిగినపక్షమున అమొత్తమును జప్తుచేసెదమనిరి.

అక్టోబరు ౨౫ వతేదినఅమెరికా అధ్యక్షుడగు రూజ్వెల్టుగారును, బ్రిటిషుప్రధానిచర్చిల్ గారును జర్మనుఅధికారుల క్రూరచర్యలను తమప్రభుత్వములు ఏవగించుకొనుచున్నవని ప్రకటనలు చేసిరి. చర్చిల్ గారు యుద్ధానంతరము ఇట్టికార్యములకుప్రతిక్రియ చేయవలెననికూడచెప్పిరి. ఈజర్మనుచర్యలయెడ నిరసనముతెల్పుటకై ఫ్రెంచిజనులు అక్టోబరు ౩౧ వతేదిన ౧౬ గంటలవేళ ఎక్కడఉన్నవారుఅక్కడనే అయిదు నిమిషములకాలము తాము చేయుచున్న పనులనావి మౌనముతోనిలుచుండవలెనని డీగాల్ గారు అక్టోబరు ౨౫ వతేదిరాత్రిఒకరేడియోప్రకటనలోసూచించిరి. ఈమరణదండనలను చాలించవలసినదనిజర్మనుప్రభుత్వమునుకోరుటకై చిలీరాజ్యప్రభుత్వమువారు ఏర్పాటుచేసిరి.

కాలిఫోర్నియాగవర్నరున్ను, ఓక్లహోమాగవర్నరున్ను, జర్మనుచర్యలయెడ అమెరికనులఆగ్రహమును ప్రకటించుటకై అక్టోబరు ౩౧ వతేదిన అమెరికనులందరును మధ్యాహ్ననంతరము ఒకనిమిషముకాలము మౌనము వహించియుండునట్లు విజ్ఞప్తిని చేయవలసినదని రూజ్వెల్టుగారిని కోరిరిగాని, రూజ్వెల్టుగారు ఆచర్యకుఒప్పుకొనలేదు.

పోపుగారువెర్లినులో తమమతశాఖాధికారిని ఈవిషయములోబోర్డియో, నాంటీసులలోని దురదృష్టఫ్రెంచిజనులకు తోడ్పడుటకై జర్మనుప్రభుత్వమునకొకవిజ్ఞప్తి చేయవలసినదనిచెప్పిరి.

ఇంతలోమార్షల్ హిట్లరుగారు నాంటీసు బోర్డియోలలోని దురదృష్ట ఫ్రెంచిజనుల ఆయుస్సులను మరికొంతకాలము [నిరవధికాలము పెంచుచున్నారు] ఉండవలెనని ఆజ్ఞ [illegible] చంపవలసినవారలను పట్టియిచ్చుటకు అవకాశము కల్పించుటకై ఇట్లుచేయబడినదని అక్టోబరు ౨౬వ తేదిన ప్రకటితమైనది.

దీనితర్వాత ఫ్రెంచిమంత్రివర్గమువారు ఒక క్రొత్తశాసనమును చేసినారు. జర్మను అధికారులకు అనిష్టములైన దౌర్జన్యములను చేయుటకు వేసికొన్న పన్నుగడలను తెలిసియున్నవారలు వాటిని అధికారులకు తెలియజేయకున్నచో ౩ నెలలుమొదలుకొని అయిదేండ్లవరకు ఖైదుశిక్షవిధించబడవచ్చును. దౌర్జన్యాలకు గురియైనజర్మను అధికారులకుతోడ్పడుటకు పోని ఫ్రెంచివారలకుకూడ ఇదేవిధముగా పెద్దశిక్షలను ఏర్పాటుచేసినారు. బ్రిటిషురేడియో స్టేషనులనుండియు మరికొన్ని విదేశీయములైన రేడియోస్టేషనులనుండియువచ్చెడి సమాచారములను వినెడిఫ్రెంచిజనులకుకూడ కఠినశిక్షలు ఏర్పాటుచేయబడినవి.

### అమెరికా బెదరింపు

అమెరికాసంయుక్తరాజ్య ప్రభుత్వపు నౌకాశాఖకార్యదర్శియగు కల్నల్ నాక్సుగారు అక్టోబరు ౨౪వ తేదిన నౌకలకవసరమగు యుద్ధసామగ్రి నుత్పత్తిచేయించు పారిశ్రామికులతో కొందరితోమాట్లాడుచు జపాను క్రొత్తప్రదేశములను సంపాదించుటకు యత్నించుచునే యున్నచో తూర్పుఆసియాప్రాంతములో సంఘర్షణతప్పదనిరి. జపానువారు తమనూతనప్రదేశసంపాదనకాంక్షను వదలుకొనవలెనని ఆమెరికాసంయుక్త రాజ్యప్రభుత్వమువారు తెలిపినదనిరి.

రష్యాకు యుద్ధసామగ్రినిపంపించుటకు మూడుమార్గములున్నవనియు అందులోఎక్కువదగ్గర ఉత్తరపుకొనయందుండే ఆర్క్ ఏంజల్ రేవు చాలమంచిదేగాని అక్కడమంచుగడ్డలను పగులగొట్టుకొనుచు ఓడలు మెల్లగాప్రయాణము సాగించవలసివచ్చుననియు, అందువల్ల జర్మనులవిమానాలనుండి ఆఓడలపై దెబ్బలుతగులు అపాయముగలదని చెప్పిరి. జపానువారివల్ల వ్లాడివోస్టాకు రేవుమీదుగా సామగ్రిపంపించుట క్షేమకరముకాదనిరి. మూడవమార్గము ఆఫ్రికాఖండమునుచుట్టి ఇరానుమీదుగా సామగ్రిచేర్చుట. ఇందులో ౧౨౦౦౦ మైళ్ళ సముద్రప్రయాణమేగాక ఇరానులో రైలుబాట వేసికొనవలసినఅవసరముకూడ ఉన్నదనిరి. మొత్తముమీద ఆర్క్ ఏంజల్ రేవుమార్గమే మంచిదనిరి.

ఇప్పుడు అమెరికను పహరానౌకలు అమెరికా సముద్రములో తిరుగుచున్నవనియు ఇటాలీయు, జర్మనీయనౌకలు ఎక్కడకనిపించినను వాటిని ముంచివేయవలసినదని ఈఅమెరికనునౌకలకాజ్ఞయొసగబడెననియు చెప్పిరి.

అమెరికాప్రభుత్వము జపానువారి విధానము న్యాయమైనదని అంగీకరించునంతవరకు అమెరికాతో రాయబారములువ్యర్థములని జపానులో ఒకపత్రిక అక్టోబరు౨౪వతేదినాటి సంచికలో హెచ్చరికచేయబడినది.

ఇటీవల జపానుఅంతటను విమానాలదాడుల విషయమై డ్రిల్లు జరిగినవి. ఇవిసాధారణమైన వ్యాయామాలుకావనియు. జపానుకు విమానాలదాడులుకలవని భయము సమీపించుచున్నదనియు జపానుప్రభుత్వ దేశరక్షణశాఖ ముఖ్యాధికారి అక్టోబరు౨౪వ తేదిన చెప్పినాడు.

నవంబరు౧౧వ తేదిన జపాను పార్లమెంటును సమావేశపరచి మంత్రివర్గమువారు వారలనుండి సానుభూతిపొందగలరట.

### నౌకావిఘాతములు

బ్రిటిషుజలాంతర్గామి మధ్యధరాసముద్రమధ్యప్రదేశమున ఒకఇటాలీయుల పాయుధనావికా నౌకపై టార్పెడో వేసినట్లు అక్టోబరు ౨౪వ తేదిన బ్రిటిషుఅధికారులు ప్రకటించిరి. ఆనౌక మునిగియుండవచ్చునని వారు. సెప్టెంబరు నెలలో బ్రిటిషు జలాంతర్గాములును విమానాలును కలిసి ఇటాలీయరేవులనుండి వెడలిన శత్రునౌకలలో నూటంటెంటెనౌకలనంతటను ముంచివేసిరి మరియున్నారు. అగస్టుసెప్టెంబరులలో కలిసి మధ్యధరాసముద్రంలో నాజీ౩౮ ముంచివేయబడినవనియు, ౨౨ బహుశా మునిగియుండవచ్చుననియు, ౧౨నౌకలకు దెబ్బలుతగిలినవనియు బ్రిటిషువారు ప్రకటించినారు.

ఉత్తరఅట్లాంటికులో ఒకబ్రిటిషుడిస్ట్రాయరునౌక టార్పెడోదెబ్బతగిలి మునిగినదనియు, అది అమెరికావారలిచ్చిన నౌకయనియు, అమెరికా వారింతవరకు ౫౦నౌకలిచ్చియుండవాటిలోరెండు నౌకలు మునుగబడినవనియు ప్రకటించిరి.

### ఆఫ్రికాలో యుద్ధము

ఆఫ్రికాలో టోబ్రుకువద్ద చిన్నచిన్నపోరాటములు జర్మనులకును బ్రిటిషువారికినిజరుగుచున్నవి. బ్రిటిషువిమానాలు ఆఫ్రికాలోనిఇటాలీయు, జర్మనీయుస్థావరాలమీదను, ఇటలీలోనినేపిల్సురేవుమీదను, జర్మనీమీదను, జర్మనులాక్రమించినదేశాలమీదను బాంబులను పడవేయుచునే యున్నవి.

బ్రిటిషుసేనలును, డీగాల్ గారిసేనలును కలిసి అక్టోబరు౨౫వతేదిన ఫ్రెంచి సోమాలిలాండులో జిబూటీకివాయవ్యమున ౨౦మైళ్ళ దూరములో నుండు గాలిలెయిటో అనుచోటిని ఆక్రమించినట్లు వార్తవచ్చినదికాని, ఇదినిజమని రూఢిపడలేదు.

## అట్లాంటికు చార్టరు ఇండియాకు వర్తించునా?

### ఇండియా అసెంబ్లీలో ప్రశ్నలు

ఢిల్లీలో అక్టోబరు ౨౩వ తేది సాయంత్రమున భారత అసెంబ్లీసభలో అట్లాంటికు చార్టరును దాని మీద చర్చిలుగారు చేసిన వ్యాఖ్యానమునుగురించి సభ్యులలో చాలామంది సభానాయకుడగు అనీ గారిని చాలాప్రశ్నలనడిగిరి. ఆప్రశ్నోత్తరములు యీరీతిగా వున్నవి.—

సర్ ఏ. హెచ్. ఘుజ్నవీ: ఒకదేశంవారు తమదేశంలో వుండదగిన రాజ్యాంగవిధానమును సిద్ధపరచుకొనవచ్చును. ఈహక్కు అన్నిదేశాలవారికివున్నది, ఆను ప్రకటన భారతదేశానికివర్తించునా?

అనీ:— దీనిగురించి చర్చిలుగారును అమెరీగారును తమఅభిప్రాయముల నిదివరకే పూర్తిగా వెల్లడించిరి. అవి యిండియాలో అన్నిపత్రికలలోను ప్రకటించబడినవి.

ఘుజ్నవీ:— నాప్రశ్నకు సూటిగా జవాబు చెప్పండి!

అనీ:—చర్చిలు అమెరీగార్ల ప్రకటనలను మీరు చదివి వాటినిబట్టి మీరే దీనిజవాబును తెలుసుకొనండి.

జోషి:—వర్తిస్తుందనో వర్తించదనో మీరు చెప్పగూడదా?

అనీ:—చర్చిలుగారు చెప్పినదానికన్న హెచ్చుగా నేనేమిచెప్పలేను.

శాంతసింగు:— చర్చిలు గారి వ్యాఖ్యానమును గురించి యిండియాప్రభుత్వమువారు బ్రిటిషుప్రభుత్వమునకు తమ అసమ్మతిని తెలిపిరా?

అనీ:—(జవాబులేదు.)

వసంత్రాయిగారు:— దీనినిగురించి ఇండియాప్రభుత్వాభిప్రాయము యేమి? వారు చర్చిలుగారి వ్యాఖ్యానమును ఆమోదించిరా?

ఎల్. కే. మైత్రాగారు:—అసలు దీనినిగురించి ప్రభుత్వమువారేమైనా ఆలోచించారా?

అనీ:—దీనినిగురించి హెచ్చుగా చెప్పుట పబ్లిక పాలసీకి వ్యతిరేకము.

శాంత:—చర్చిలు గారు యిట్లా వ్యాఖ్యానము చేసిన తరువాత ప్రభుత్వమువారి మంత్రిమితానికి భంగము కలుగలేదా?

అనీ:—మన స్నేహితము కలుగుట కలుగకపోవుట వ్యక్తులకు మాత్రమేగాని సంఘాలకు వుండదు.

శాంత:—పార్లమెంటుచే వశపరుచుకొనబడిన దేశాలకుమాత్రమే యీ చార్టరు వర్తించునా?

అనీ:—మీరే వూహించుకొనండి.

శాంత:—హిట్లరు ఇండియానుకూడా వశపరుచుకున్నచో ఇండియాకుకూడా చార్టరును వర్తింపజేస్తారా? (పరిహాసం)

సర్ హెన్రీగిడ్నీ గారు.— దీనిని ఇండియాలో యేభాగానికి వర్తింపజేస్తారు!

శాంత:— ఆంగ్లో యిండియను భాగానికి

[పరిహాసం]

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర కార్తీక శు॥ ౧౫

సోమవారము

## ౧౩౫౧ ఫసలీ బడ్జెటు

ఆర్థిక శాఖామంత్రులగు నవాబు మిర్జా యార్ జంగు బహద్దరుగారు ౧౩౫౧ఫస్లీకొరకు ప్రకటించినబడ్జెటు (ఆయవ్యయఅంచెన) ప్రశంసనీయముగా కనబడుచున్నది. ప్రపంచసంగ్రామము ప్రారంభమయిన నాటి నుండి అన్ని దేశములయొక్క ఆర్థికవ్యవస్థలు తల్లక్రిందులైనవి. నేడుభారత దేశమున బహుప్రాంతములలోను దేశీసంస్థానములలోను ఆయవ్యయములను సరిపెట్టు బడ్జెటులే (Balanced Budgets)కష్టసాధ్యమైపోయినవి. అట్టితరి ఈరాష్ట్రమునకు సిలుకునిగిలినబడ్జెటు (Surplus Budget)ను ప్రసాదించినందులకు ఆర్థిక శాఖామంత్రిగారు అభినందనీయులు.

ప్రభుత్వపు ఆయవ్యయములను నిర్ధారణచేయువారికి ౧౩౫౧వఫస్లీయొక్క పరిస్థితులు మిక్కిలిప్రతికూలములై యున్నవి- వర్షములులేకపోవుటచే సూపాయిలో ఎనిమిదిఅణాలకన్నతక్కువఖరీఫు సేద్యముచేయబడెను-ఫలితమైతేనగటుపై కలణాలుకూడలేదని వార్తలువచ్చినవి. చెరువులునిండక పోవుటచే, చాలావరకు ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లాలలో తప్పతదితరజిల్లాలలో ఆబీపంటవిడువవలసి వచ్చినది. అందుచేతభూమిపన్నులో లోటుపడుటేకాక కొన్నిజిల్లాలలో తకావీఋణములు మున్నగునవి ప్రసాదించుటవలన ఖర్చుపెరిగినది. దీనికితోడు యుద్ధముయొక్కఒత్తిడికూడ మనరాష్ట్రముయొక్క ఆదాయముపై నపడినది ౧౩౫౧ ఫసలీలో మొత్తముమీద ౫౧లక్షలరూపాయీలు సైనికవ్యయమునకుగాను ప్రత్యేకింపబడినవి. ఇట్టిప్రతికూల పరిస్థితులలోకూడ మనరాష్ట్రమునకుమిగులుకలుగుబడ్జెటు(Surplus Budget) నిర్ణయమగుట ఆమోదావహము.

౧౩౫౧వ ఫస్లీలోని రాబడిసుమారు ౯౧౫లక్షల 23వేలని ప్రభుత్వమువారు అంచనావేయుచున్నారు. దానివివరమిట్లుచూపించినారు.

| | | |
|---|---|---|
| భూమిపన్ను | ౨౭౮ | లక్షలు |
| సుంకము | ౧౨౦ | ,, |
| కల్లుసారా | ౧౭౧ | ,, |
| రైల్వేలు | ౧౩౫ | ,, |
| తదితరములు | ౨౧౫.23 | ,, |
| మొత్తమురూ॥ | ౯౧౫.23 | ,, |

ఈసంవత్సరములో చేయుదలచిన వ్యయము ౯౦౭లక్షల ౭౫వేలని అంచనావేయబడినది. దానివివరము లీవిధముగా చూపినారు.

| | | |
|---|---|---|
| భూశాఖ | రూ॥ ౬౬.33 | లక్షలు |
| అబ్కారీసుంకము | ౬౮.౬౫ | ,, |
| వడ్డి,ఋణములతీర్పు | ౬౯.౨౫ | ,, |
| శ్రీనిజాం ప్రభువు గారికి సమర్పించుకొను మొత్తము | ౫౦ | లక్షలు |
| శ్రీ రాకుమారుల కిచ్చుకొను మొత్తము | ౧౯.౮౮ | ,, |
| సైన్యము. పోలీసు | ౧౩౩.౩౭ | ,, |
| విద్య | ౧౦౫.౭౧ | ,, |
| సర్కారీబంగ్లాలు తోటలు నిర్మించుటకుగాను | ౭౬-౪౭ | ,, |
| వైద్యశాఖ | 33-౫౮ | ,, |
| తదితరములు | ౨౯౨.౨౧ | ,, |
| మొత్తము రూ॥ | ౯౧౩-22 | లక్షలు |

పైనచేర్కొనబడిన రాబడినుండి ఖర్చుపోగా ప్రభుత్వము వారికోశమునకు ౧లక్ష౯౬వేల రూపాయీలు మిగులును.

నేటిబడ్జెటు ౧౩౫౦వఫసలీ బడ్జెటుతో సరిపోల్చిచూడగా రాబడిలో భూమిపన్నునుండిరూ౩౬లక్షలు,అబ్కారీనుండిరూ॥౪లక్షలు తక్కువకానవగును. కాని చక్కెరనుండి రూ.౭-౨౩ లక్షలును. నిప్పుపెట్టెలనుండి రూ॥౮.౫లక్షలును ఎక్కువపన్నులచే ఈతచ్చు కొంతవరకు పూర్తియయినది- అటులనే ప్రభుత్వము వారి వ్యయములోకూడ ౨.౭౯లక్షలు రూపాయీలు మనహాయింపుకలదు-పూర్వముప్రతిశతం ౫రూ॥వడ్డికలట్టియు ప్రతిశతం ౫౺రూ॥వడ్డికలట్టియు సర్కారీఅప్పులనుమార్చి నూతనౕ౩౺ ప్రతిశతఋణమును ప్రజలుగైకొనుటే దీనికిముఖ్యకారణము-

ఈబడ్జెటులో గమనింపదగిన ముఖ్యమైన విషయమొకటికలదు- ప్రజలఅభివృద్ధికి, సౌకర్యమునకు పాటుబడు ప్రభుత్వపుశాఖలకు ౧౩౫౦వఫసలీలో నొసగనధనమీయేడుకూడనొసగబడినది. కొన్నిప్రజాహితశాఖలకు గతసంవత్సరము కంటె యీసంవత్సరము ఎక్కువపైకమునుకూడఇచ్చినారు. ౧౩౫౦ ఫసలీలోకంటె విద్యాశాఖకు ౨లక్షల౨వేలును వైద్యశాఖకు రూ॥౪లక్షల ౨౯వేలును ఎక్కువగా ఈయేడుప్రత్యేకించినారు. ఇట్లుఉదారముగా వివిధశాఖలను ధనమును ప్రత్యేకించినప్పటికిన్ని బడ్జెటులో మిగులుచూపుట, మనరాష్ట్రపు ఆర్థికనిర్మాణముయొక్క పటుత్వమునునిరూపించుచున్నది.

ఋణముల పరిస్థితినిచూచినప్రభుత్వమువారి ఆర్థికస్థితి బాగావిశదమగుచున్నది- మొత్తముమీద ప్రభుత్వమువారి ఋణములు ౯౬౫.౯౭లక్షల రూపాయీలు. ఈధనముముఖ్యముగా నీటివసతులు(Irigation)రైల్వే, విద్యుచ్ఛక్తి, టెలిఫోను మున్నగుఆదాయ ప్రదములైన కార్యములలో వినియోగింప బడినది- ఈఆస్తియొక్క విలువరూ॥ ౨౬౬౦.౦౮ లక్షలు, అనగా అప్పుకంటెఆస్తి మూడురెట్లు. ఇదిరాష్ట్రపుఆర్థికవ్యవస్థ కెంత యుఘుష్టికరము.

రాష్ట్రజీవనమునకు వ్యవసాయము మూలాధారము. రైతులక్షేమమే రాష్ట్రముయొక్కక్షేమము. వారియభివృద్ధియే రాష్ట్రాభివృద్ధి. అట్టిరైతులు నేడు చాలాదుస్థితిలో ఉన్నారు. క్రిందటిసంవత్సరముపంటలు తృప్తికరముగా ఉండిన ను ముడివస్తువులకు ధరపలుకకపోవుటచే రైతులకులాభము లభింపకపోయెను. ఈయేడుఅన్నివస్తువుల ధరలు అపరిమితముగపెరిగిపోయినవి. కానిపంటలు శూన్యము. అందువలన రైతులరాబడి శూన్యమై ఖర్చులుపెరిగినవి. తెలంగానాలోని పల్లెలలోమనుష్యులు, పశువులుతిండిలేక మలమలమాడు చున్నారు. ప్రభుత్వము వారిదిగమనించియే బావులక్రింద పశుల మేతకై పంటలుపండించినచో శిస్తులను క్షమించివేతుమనియు, నీటికాలువల క్రిందకూడ యిట్టిపంటలు పండించవచ్చునని యుప్రకటించిరి- పశువులమేతకై కలక్షలరూపాయీల తకావీ ఋణముకూడ ప్రసాదించిరి. మేతలకోతాలనుకూడ ఏర్పరిచిరి. ఈసహాయమునకై రైతులు చాలాకృతజ్ఞులు. కానిఇదిచాలదు. వారి దుస్థితి, బాధలుఇంతటితోతీరవు, ప్రభుత్వమువారింతకంటె ఎక్కువ సాత్భూత్వమునుచూపవలెను. బహమను నెలవరకు పశువుల మేపు సుంకము(Garzing fees) వసూలుచేయమని సర్కారువారు సెలవిచ్చిరి- రైతులవద్ద మేతలలో పాతసిలుకు ఉండిన అదిబహమనువరకు స్వాహాయగును. తర్వాతనేవారికి దానిఅవసరముపారము కావునముంగి ఆజూరువరకు సుంకాలుతీసుకొనగూడదని సూచించు చున్నాము. ఇంతేకాదు పన్నులలోకూడ చాలవరకుమాఫీయియ్యవలెను- ౧౩౫౦ ఫస్లీబడ్జెటులో భూమినుండి ఆదాయము రూ॥౩౦౮లక్షలు అంచనా వేయబడియుండెను. కానిరూ॥ ౩౨౭లక్షలు వసూలగునని రెండవసవరణ అంచనాలో (Revised Estimates) తెలిపియున్నారు. రైతులనుండిలభ్యమైనయీ హెచ్చు ౧౯ లక్షలరూ॥ నేడు రైతుల బాధలనివారణలో వినియోగించుటభావ్యము. ప్రభుత్వమువారి ఆర్థికవిధాన నియమములుకూడ దీనినేసూచించుచున్నవి. ఏశాఖనుండి వ్యయమునకుమించిన ఆయముకలిగి ద్రవ్యముమిగులునో ఆద్రవ్యముపై మొదటిహక్కు ఆశాఖదేయని శాఖాయిత ఆర్థికప్రణాళిక(Scheme of Departmentalization of Finances) నిర్దేశించుచున్నది.

రైల్వేనుండికూడ ౧౩౪౯ ఫసలీలో అంచనావేసిన రూ॥౧౩౫లక్షలకు బదులుగా రూ॥౧౪౨౨౫లక్షలు, అనగా రూ॥౭,౨౫లక్షలు ఎక్కువరాబడి కలిగినది- కానిప్రయాణికుల సౌకర్యములను పెంపొందించుటకు తగినయత్నములు వ్యక్తమగురీతిగా జరుగుటలేదు- రైలుడబ్బాలలో కూర్చొనుటకుకూడ వీలులేని జనసమ్మర్దము, త్రాగుటకు నీరుకూడా చిక్కని కొన్నిస్టేషనులు, ఎండవానలనుండి రక్షణలేని జంక్షను ప్లాటుఫారములు-ఇవి నేటికిని కానవచ్చుచున్నవి. వీటితోబాటు కాలపరిస్థితులనుబట్టి జీవనము గడుచుటయే దుర్లభముగానుండు కార్మికజీవులు ఇంచుక కూలీలో హెచ్చుచేయండీఅని ప్రాథేయపడుచున్నారు-కాని రైల్వేకార్మికుల మొరలటులనే నివారణకాకుండాఉన్నవి. ప్రభుత్వమువారు అందు ముఖ్యముగా రైల్వేఅధికారులీవిషయముపై దృష్టి మరల్తురని మాసూచన.

సర్కారీ ఉద్యోగులు యుద్ధకాలమనియు ధరలు పెరిగినవనియు జీతాల హెచ్చింపు కోరుచున్నారు. వారికన్న ముందుగా ఈదిక్కులేని కాయకష్టము చేయు కూలీల మొరలు వినవలసియుండును. ప్రభుత్వమువారి ఆర్థికవిధానము ప్రశస్తమైనవి. వారి ఆర్థిక పరిస్థితులు బలవత్తరమైనవి. అందుచే వారు మేము పైనసూచించిన అంశములగూర్చి సానుభూతితోపరిశీలించితగురీతిసౌకర్యములొసంగుదురని అభిప్రాయపడు చున్నాము.

ఈబడ్జెటులో ఒక్కటిమాత్రము కొరవడియున్నది. అది ఆదాయంపన్ను. అన్నివర్గాలవారు (ఒక్క సాహుకారులు తప్ప) ఆదాయంపన్ను విధించవలెనని కోరుచున్నారు. ఈ రాష్ట్రములో అది ప్రవేశపెట్టునంతవరకు పన్నుల భారమంతయు ఒకేవర్గమువారిపై పడుచుండును. పైగా ఏవర్గమైతే సుఖముగా నిరాక్షేపముగా సంతోషముగా ఏటేట సర్కారువారికి ఇంచుమించు అర్ధకోటి వరకు ఆదాయంపన్ను ఇచ్చుకోగలదో ఆ వర్గము ఏబాధ్యతలేకుండా అనాదిగా తప్పించుకొనిపోవుచున్నది. యుద్ధమువచ్చినందున ఆదాయంపన్ను మాట తలపెట్టలేదని మనప్రభుత్వమువారు తెలిపినారు- యుద్ధం వచ్చినకారణంచేతనే ఇప్పుడే ఈపన్ను విధించవలసియుండెను. యుద్ధంమూలాన వర్తకులకు కొన్నికొన్ని వస్తువులలో నాల్గంతలు ఆరంతలు లాభాలు కలిగినవి. ఇంకొకకారణ మేమన ఆదాయముపన్ను చరిత్రను చూచినట్లైన ఇంగ్లాండులో పూర్వంపిట్టు మంత్రిగా ఉండినప్పుడు యుద్ధం ఖర్చులకుగాను ఆదాయంపన్నును సృష్టించెను. కావున యుద్ధములోపుట్టిన పన్నును ఈ యుద్ధములో విధించుట సుముహూర్తములో చేసిన శుభ కార్యముగా ఉండగలిగినట్టిది. మైసూరు సంస్థానంవారు ఏండ్లతరబడి ఆదాయం పన్నును వసూలు చేయుచున్నారు. తిరువాన్కూరు సంస్థానముగా కొద్దిపాటిగానైనను ఆదాయం పన్ను వసూలు చేయుచున్నారు. మనరాష్ట్రంవారు దానిని ఎప్పుడు అనుసరింతురోయేమో అంతయు ప్రభుత్వాధీనమై యున్నది మాటిమాటికి సూచించుట మాత్రము విధియై యున్నది.

ఈబడ్జెటులోని ఒకకొత్త సంగతినిని చాలా సంతోషమైనది- అది గజెటెడ్ అధికారుల జీతాల తగ్గింపు- ఈనాడు కాదు ఇంచుమించు ౬ ఏండ్లనాడు మేమీ సూచనను ప్రత్యేక సంపాదకీయములోచేసి సూచించియుంటిమి- నాటినుండియింతవరకు ౫-౬మారులైనా ఎత్తిచూపించినాము- మనరాష్ట్రములో అనవసరమైన ఉద్యోగాలు, అత్యధిక వేతనములు, ఒకరికినూరు మగ్గురుఅధికారులు,అలవెన్సులు ఇట్టివెన్ని యోకలవు-ఇట్టి సౌకర్యాలున్నను ఎన్నడుకూడా ఏకచ్చేరీ నివేదికకూడా సకాలంలో రాకపోయెను-ప్రతికచ్చేరీలో సోమరితనముగా చిల్లరగుమాస్తాలు పని చేయుచుందురు- ఇదంతయు ప్రభుత్వానికి నష్టకారియే- గజెటెడ్ జీతాలతగ్గింపు ఏనామకార్థముదోకాక దిట్టమైనదిగా ఉంటే (ఒక్క జీతంకోతలుపడ్డ అధికారులుతప్ప) ప్రజలంతా సంతోషింతురు-

---

### భూశాఖాధికారి పర్యటనం

రయిమూబజిల్లాలో సర్ బాస్కర్ దొరగారు పర్యటనచేయుచున్నారు దివాళిపండుగ కావునవారు పాదచారులై సుకాణాలుచూచుచు జెల్లి- దీపావళికాయిగా వర్తకులు శ్రీవారికి గొప్పమొత్తాన్ని యుద్ధనిధికిఇచ్చిరి- రాయమూరునకు సమీపములోకట్టుచున్న వారధినితిలకించిరి- యుద్ధసహాయార్థమై ఒకవినోదప్రదర్శనము జరిగెను దానిప్రారంభోత్సవమునువీరుచేసిరి- స్థానిక వైద్యాలయానికి అచ్చటనే ౧౦౦౦౦రూ॥ సర్కారీనుండి ఇచ్చుటకుసెలవిచ్చిరి

---

### సాహుకార్లకమిటి

హైదరాబాదునగరం ధామాలాల్ గారి బంగ్లాలో సెప్టెంబరు ౨౯న అజారుసాయంత్రము జరుగును

## హిందూపౌరస్వాతంత్ర్య సంఘము

హైదరాబాదు సంస్థాన సర్వప్రజాసంస్థల అధ్యక్షులకు విజ్ఞప్తి

---

మహాశయులారా!

హిందూపౌర స్వాతంత్ర్య సంఘము స్థాపింపబడినది మొదలు ౨౧ అక్టోబరు ౧౯౩౯ పౌర స్వాతంత్ర్యసంపాదనకై తనయశక్తిప్రయత్నములపరిరోగించుచుండుట అందరికిని తెలిసినవిషయము. ఈసంస్థాభ్యుదయమునకై ప్రాథమిక స్వత్వములే ముఖ్యావశ్యకములని నొక్కి చెప్పవలసినక్కరలేదు.

వివిధప్రజాసంస్థలు ప్రస్తుతపరిస్థితినిగమనించి మేముచెప్పురీతి ప్రాథమిక స్వత్వముల సమస్యపై ప్రతివారును తమశక్తినికేంద్రీకరించుట యుక్తమైనదనిగ్రహించుట మిక్కిలి ముఖ్యమగు విషయము.

౧-వాక్ స్వాతంత్ర్యము ౨- ముద్రణాస్వాతంత్ర్యము ౩-ధార్మికస్వాతంత్ర్యము ౪-విద్యాస్వాతంత్ర్యము ౫- సమావేశ స్వాతంత్ర్యముల పైననే ప్రతిసభ్యజాతియొక్క రాజనీతిఆధారపడియున్నది- హైదరాబాదుసత్యాగ్రహాందోళన తర్వాత మ-ఘు-వ-ప్రభువరేణ్యులు ప్రజలప్రాథమిక హక్కులకొన్నింటిని ప్రసాదించుటకై వాగ్దానమొసంగిరి-

అయితే రాజ్యాంగసంస్కరణల ప్రవేశపెట్టుటకై జారీచేయబడిన గవర్నమెంటు ప్రకటనలయందు ప్రాథమిక స్వత్వములగూర్చి యేమియును ప్రకటించకుండుట, కడులోచనీయము

సంస్థానమువివిధసంస్థలు ఈవిషయమూలంబెంతభిన్నించినను, ప్రాథమిక స్వత్వములవిషయమై యేకీభవించియుండుట అందరెరింగిన విషయమే

కేవలము పైఉద్దేశ్యముకొరకై స్థాపింపబడినందున మాసంఘము తనశక్తికొలది యితరులసహాయము లభించినసరియే లభించకుండినసరియే స్వయముగ నేనుపాటిసంపాదనార్థము పాటుబడుచు కొలదికాలములోనే మాప్రయత్నములందు జయప్రదముకాగలమని దృఢముగవిశ్వసించుచున్నాము. అయితే ఈసమస్యఅందరికిని ముఖ్యమైనదియు, సర్వప్రియమైనదియు, పవిత్రమైనదియు యున్నందున న్యాయయుక్తమైన [Constitutional agitation] ఆందోళనమునకైనను సహాయముచేయుటకై అందరిని ఆహ్వానించుచున్నాము. ఎంతవరకు ఏకీభవించెదరో యెవ్విధముగ యేకీభవించగలరో ౧ డిసెంబరువరకు దయచేసి తెలుపగలరని ప్రార్థించుచున్నాము-

ఇట్లు

వి. రామచంద్రరావు

సెక్రెటరీ

పతా:- ౮-౫-౯౬౫ సుందర్ భవన్ గౌలీగూడ

౧ నవంబరు ౧౯౪౧

... ... ...

(ఈవిజ్ఞప్తిప్రతులు క్రిందిసంస్థలకుపంపబడినవి)

| | | |
|---|---|---|
| ౧-అర్యప్రతినిధిసభ | నిజాంరాజ్యము | |
| ౨-సనాతనధర్మసభ | హైదరాబాదుసంస్థానం | |
| ౩-ఆదిహిందూసభ | ,, | ,, |
| ౪-ముదిరాజ్ మహాసభ | ,, | ,, |
| ౫-లింగాయత్ పరిషత్ | ,, | ,, |
| ౬-మార్వాడికాన్(ఫెన్స్) | ,, | ,, |
| ౭-అంజుమన్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ | ,, | ,, |
| ౮-ఆంధ్రకాన్(ఫెన్స్) | ,, | ,, |
| ౯-కర్నాటక్ ,, | ,, | ,, |
| ౧౦-మహారాష్ట్ర ,, | ,, | ,, |
| ౧౧-యూనియన్ ,, | ,, | ,, |

---

### విద్యాధికారి

సర్ మహమ్మద్ హుసేన్ జాఫ్రీ గారి పెన్షను తీరి అయినందున తను విద్యాడైరెక్టరు పదవినిమరల స్వీకరించినారు-

---

### నిరాకరణ

హిందూప్రజామండలి వారు హైదరాబాద్ ప్రభుత్వానికిచ్చిన రాజ్యాంగసంస్కరణఖండన ప్రకటనలో పాలరావు బూర్గుంకర్ వకీలు గారు తెలుపకనిసంతకంచేయలేదని వ్రాసియుండిరి- తనకువారిగా తెలుపకుండానేయే సంతకంపెట్టినారని పత్రికాప్రకటన చేయుచున్నారు-

### పటము

హైదరాబాదు పురపాలక సంఘహాలులో రాజానరసింగరజీ బహాదర్ గారి రూపపటాన్ని స్థాపింపనున్నారు-

## బ్రిటిషు వారి భారతీయ విధానమునెడ అసంతృప్తి

యుద్ధ సహాయసంఘము నుండి సభ్యుని రాజీనామా

చిత్తూరుజిల్లాలో గొప్ప వ్యాపారస్థుడును, రెడ్డిలలో మంచిపలుకుబడిగలవాడునునగు శ్రీ పాలకరామచంద్రారెడ్డిగారు చిత్తూరుజిల్లా యుద్ధ సహాయసంఘమునుండియు దాని శాఖాసంఘము లనుండియు తన సభ్యత్వమును వదలుకొన్నవార్త తనసభ్యత్వమునకు సంబంధించిన పత్రములన్నిటిని జిల్లాకలెక్టరుగారికి రాజీనామాపత్రముతోపాటు పంపించివేసినట్లు "హిందూ" పత్రికలో చిత్తూరుజిల్లా కాంగ్రెసుసంఘముయొక్క ఏజంటుఅగు టి. కె. తాతాచారిగారి ప్రకటనవచ్చినది—ఈరెడ్డిగారు జిల్లాకలెక్టరుగారికివ్రాసిన రాజీనామాలేఖలో తాను—ఇంతవరకు స్థానిక స్వపరిపాలనసంస్థలు మున్నగు ప్రజాహితసంస్థలలో పనిచేసియుంటిననియు, జిల్లా యుద్ధసహాయసంఘములోచేరి యుద్ధనిధికిని యుద్ధప్రలాబరీలకును చాలాద్రవ్యము సహాయముగా సమకూర్చితిననియు, తానుఒకలక్షరూపాయలను వడ్డీ ఆపేక్షించకుండ యుద్ధసహాయానికై అప్పిచ్చితిననియు, ఇదంతయుఎప్పటికైనను బ్రిటిషు ప్రభుత్వమువారి న్యాయబుద్ధిమారి భారతదేశముయెడ వారివైఖరి మారునన్న ఆశతోనే చేయబడెననియు, కామన్సు సభలో చేసిన ఆశాజనకప్రకటనలను, అట్లాంటిక్ చార్టరును గురించి చేసినప్రకటనను చూచినతర్వాత, భారతదేశస్వాతంత్ర్యముకొఱకై పోరాడుచున్న భారతజాతీయకాంగ్రెసుమహాసభతోచేరకుండ ఏ ఆత్మగౌరవముకల భారతీయుడును ఉండజాలడనియు, అందువల్లతాను, మహాత్ముని నాయకత్వమునచేరి పనిచేయుటకు పోవుచున్నాననియు వ్రాసినారు.

రెడ్డిగారు తర్వాత గాంధిమహాత్మునివద్దకుపోయి యుద్ధవిషయమై సంభాషించగా, మహాత్ముడు వారికి ఈ క్రిందివిధమైన సందేశమునొసగినాడు:"తాము ఆదేశప్రయత్నానికి సహాయము చేసియున్నట్లే కాంగ్రెసుకున్ను మనుష్యులను, ధనమును, తెలివినియిచ్చి సహాయముచేయవలెను."

## కలకత్తాఖాళీచేయుటకు ఆలోచనలు

బెంగాలుప్రభుత్వ కార్యదర్శుల కార్యాలయమందు అక్టోబరు ౨౭ వ తేదీన జరిగినఅధికారుల సభలో ఉపద్రవపరిస్థితులేర్పడినప్పుడు కలకత్తా వారలను కలకత్తానగరమునుండి జిల్లాలకుపంపించుటకుచేయుటఎట్లు అనువిషయమైచర్చజరిగెను.

## కేంద్రశాసన సభనుండి ముస్లింలీగు సభ్యుల నిర్గమనము

వైస్రాయిమంత్రివర్గ విస్తరణపద్ధతియెడ ఆగ్రహావిష్కారము

అక్టోబరు ౨౮ వ తేదీయుదయము భారతశాసనసభయగు అసెంబ్లీసమావేశములో జిన్నాగారు ఒకవాఙ్మూలమునుచదివిరి. భారతదేశ రాజ్యాంగ సంస్కరణకు సంబంధించిన పెద్దవిషయములను సమష్టిగాఆలోచించుటకు అంగీకరించుచు ముస్లింలీగువారు ప్రస్తుతముయుద్ధప్రయత్నములయందు బ్రిటిషువారికి తోడ్పడగలుగవలెనని కేంద్రప్రభుత్వమందును, రాష్ట్రప్రభుత్వములయందును తమకునిజమైన అధికారము నొసగవలెనని కోరియుండగా, ఆకోరికనుత్రోసివేసి అధికారులు తమయిష్టమువచ్చినట్లుగా వైస్రాయిగారి మంత్రివర్గమును విస్తరింపజేసినారనియు, ఇదివిశేషముకాదని ఈవిషయమున సంబాధముగలవారలు గ్రహించి, అనిర్ణయమునుమార్పుకొనునట్లు చేయుటకై అసెంబ్లీనుండి ముస్లింలీగుసభ్యులు తమఆగ్రహమునుసూచించుటకు గాను నిర్గమించునట్లు నిర్ణయించుకొనబడినదనియు జిన్నాగారుచెప్పిరి. ఈవాఙ్మూలము చదివినతర్వాత ముస్లింలీగుసభ్యులందరును ఒకసారిగా సభనుండి వెడలిపోయిరి.

## విచారణలేని కాంగ్రెసు సత్యాగ్రహఖైదీల విడుదల

న్యాయస్థానాలవల్ల విచారణలేకుండా జెయిళ్లలో బంధితులైయున్న కొందరు కాంగ్రెసుసత్యాగ్రహ ఖైదీలను నవంబరు ౧ వ తేదీన విడుదలచేయుటకు మదరాసుప్రభుత్వమువారు నిర్ణయించినారు. వారలు బులుసుసాంబమూర్తి, పట్టాభిసీతారామయ్య, కోమరాజాసాహెబు, అయ్యదేవర కాళేశ్వరరావు గర్దరంగయ్యనాయుడు, కె.మాధవమీనన్, యస్. దివకరస్వామిగారలు వీరలును న్యాయస్థానాలవల్ల శిక్షింపబడిన ఖైదీలకు పంపియున్నచో నవంబరు ౧ వతేదినాటికి వారలవిడుదలజరిగియుండెడిదిగాన, వారలను విడుదలచేయుచున్నారేగాని, ప్రభుత్వవిధానములో మార్పేదిగాని కలిగినందువల్లగాదని "హిందూ"పత్రికకు ప్రభుత్వాధికారులవల్ల తెలియుచున్నది.

## అయిదుమైళ్ల దూరము విమానము నుండి క్రిందికి దూకుట

ఆర్థర్ స్టార్కిన్ అనువాడు ఫ్లైయింగుఫోర్ట్రెస్ విమానమునుండి ౩౦౦౦౦ అడుగుల క్రిందికి దూకగలిగినట్లు లండనువరకు పత్రికయగు "డెయిలీటెలిగ్రాఫు"కు దానివిమానచాలకుడు వ్రాసినాడు—స్టార్కిన్ పారచూటు లేకుండా ౨౫౦౦౦ అడుగులదూరము—అనగా అయిదుమైళ్లకంటె ఎక్కువదూరము క్రిందికి గాలిమోటలో దిగెను—అతనికుండెకోట్టులోను లెక్కలేను, నాడిలెక్కలను తెలుపుసాధనములు అతనిశరీరమునకు ఏర్పాటయియుండెను—అతనికి పెట్టవలసినవస్తువులను, ప్రాణవాయుకవచమున్ను, శిరస్త్రాణములో అమర్చి రేడియో పెట్టుచున్నుండెను. ఈరేడియోలో అతను భూమిపైనుండిగమనించుచున్నవారలకు తానువిమానమునుండిదిగినవెంటనే సమాచారము తెలిపెను. మొత్తముమీదగంటకు ౧౨౦ మైళ్ళవంతున అతడుదిగెను—అతడు స్పృహ తప్పకుండా నుండెను.

## గ్రాండ్ ముఫ్తీగారు బ్రిటిషు వారిని తప్పించుకొనుట?

పాలెస్టైనులో జెరూసలెమునందలి గ్రాండ్ ముఫ్తీగారు బ్రిటిషువారినితప్పించుకొని దక్షిణఇటలీలో ఒకరేవుపట్టణమున చేరినట్లు ఇటాలీయులు ఒకవార్త వ్యాపింపజేసినారు.

## భారతీయుల ఐకమత్యమునకై జమియత్ నాయకుని విజ్ఞప్తి

అఖిలభారత జమియతుల్ ఉలేమా సంఘముయొక్క అధ్యక్షుడగువారకత్ మౌలానాసయ్యదుమహమ్మద్ అహమ్మదుమదానిగారు అస్సాం రాష్ట్రమునందలి సిల్హెట్ నగరములో అక్టోబరు ౨౬ వ తేదిసాయంకాలము అస్సాంజాతీయసభలో సభ్యుడగు వైద్యనాథముఖర్జీగారి అధ్యక్షతనజరిగిన బహిరంగసభలో ఉపన్యసించుచు "నేనుభారతదేశములో జన్మించినాను, భారతదేశములోజీవించెదను. భారతదేశములోనేమరణించెదను అని చెప్పిరి. భారతదేశస్వాతంత్ర్యము సాధించుటకై అన్నితెగలవారలును ఐకమత్యముగలిగియుండవలెను, ఉదారభావములు గలిగియుండవలెననియు. ఒకతెగవారుసహకారములేకుండ తక్కినవారలు ఉండజాలరనియు, ఐకమత్యమును సాధించుటకై రాష్ట్రభాషయగు హిందూస్థానిభాషను అందరును నేర్చుకొనవలెననియు చెప్పిరి.

## కాంగ్రెసులో చేరదనన్న పీరుగారికిబంధము

సింధురాష్ట్రములో పీర్ పగారూ అనువారు తమఅనుచరులతోకూడ కాంగ్రెసులోచేరదలచినట్లు ఇదివరలోప్రకటించియుండిరిగదా. వారిని భారతదేశరక్షణనిబంధనలననుసరించి అరెస్టుచేసి సింధురాష్ట్రములోనుండి వెళ్లిపోవలెనని ఆజ్ఞాపించినారు. వారినిఅక్టోబరు ౨౭ వ తేదీయుదయము సింధుపోలీసులు కాపలాతో జబల్పూరుకుతీసికొనిపోయినారు. అక్కడనుండి వారిని బస్సులో నాగపూరునకుతీసికొనిపోయినారు. అక్కడవారిని నిర్బంధములో ఎంతకాలముంచెదరో తెలియదు [illegible]



## ఇంకను అనావృష్టివార్తలు

వరంగల్లుజిల్లాలోనిపాఖాల తాలూకాలో నూరుపల్లిగ్రామంలో వర్షములు లేనందువల్ల చెరువులలోనీరురాలేదు. అందువలనగాజే సేద్యము కాలేదు— పునాస పైరులుఎండిపోయినవి. రబ్బీపైరులుకూడచెడినవి— బావులలో నీరులేనందువల్ల కొంచెమైనపంటి పైరులనుకూడవేయ లేకపోయినది. పశువులకుమేతలేదు— ఈచుట్టుపట్టుల గ్రామాలలో పెద్దరోగముున్నది—

## గ్రంథాలయస్థాపన

ఈవృష కార్తీక శు॥ 3 గురువారమునకు సరియగు ఈ అక్టోబరు ౨౩ వ తేది రాత్రి నల్లగొండజిల్లామిర్యాలగూడెం తాలూకా గూడూరుగ్రామంలో ఒకచిన్నభక్తసమాజమునందు చంద్రగ్రంథాలయమునొక దానిని స్థాపించుటకు తీర్మానించి, సి. వి. రాంరావుగారు అధ్యక్షుడుగాను, గుండా. నరసింహారావు కార్యదర్శిగాను, ముగ్గురు కోశాధిపతులు, ౨౦ మందిక్షైగా సహాయకులుగల ఒక పాలకపరిషత్తు నెన్నుకొనిరి.

## ద. మ. వ. నిజాంస్టేటు రైల్వే

## నోటీసు

సికింద్రాబాదు బెంగుళూరు సిటీమధ్య 1,2,3 తరగతులవర్పాటుగల రైలుడబ్బా అదనముగా వేయుట

శనివారము 1వ నవంబరు 1941 నుండి ప్రయాణీకుల సౌకర్యార్థము 1,2,3 తరగతులు పర్పాటుగల ఒక రైలుడబ్బా సికింద్రాబాదు బెంగుళూరు సిటీలమధ్య కింద సుదహరింపబడిన రైలుబండ్లతో వేయబడును.

| | | గం.ని. | | | గం.ని. |
|---|---|---|---|---|---|
| సికింద్రాబాదు | పో. | 6-48 | బెంగుళూరు సిటీ | పో. | 22-00 |
| హైదరాబాదు ఎం.జి. | రా. | 6-58 | గుంతకల్ | రా. | 7-00 |
| | పో. | 7-03 | | పో. | 8-35 |
| ద్రోణాచలం | రా. | 14-57 | ద్రోణాచలం | రా. | 10-20 |
| | పో. | 15-23 | | పో. | 11-10 |
| గుంతకల్ | రా. | 17-15 | హైదరాబాదుఎం.జి. | రా. | 19-26 |
| | పో. | 18-50 | | పో. | 19 30 |
| బెంగుళూరు సిటీ | రా. | 6-15 | సికింద్రాబాదు | రా. | 19-50 |

చీఫ్ట్రాన్సు సూపరింటెండెంటు ఆఫీసు
సికింద్రాబాదు దక్కన్
అక్టోబరు 29, 1941
(టి. ఆర్, 7/499/41

(బై ఆర్డర్)
ఎ. డబ్ల్యు. వాట్సు,
చీఫ్ ట్రాన్సు సూపరింటెండెంటు

## ద. మ. వ. నిజాంస్టేటు రైల్వే

## నోటీసు

బుధవారము 5 నవంబరు 1941 తేదినుండి నెం. 33 అప్ పాసింజరు రైలు పింగ్లివద్ద ప్రయాణీకులను దింపుటకు ప్రయాణీకులను ఎక్కించుకొనుటకు ఆగును. క్రింద సుదహరించిన మాదిరిగా యీరైలు రాకపోకలు సరిచూడబడును.

| | | 33 పాసింజరు<br>గం. ని. |
|---|---|---|
| పింగ్లి | పోక | 9-50 |
| మిర్ఖేల్ | పోక | 10-01 |
| పూర్ణ | రాక | 10-19 |
| | పోక | 10-41 |
| లింబగాం | పోక | 11-06 |

తరువాత మార్పులేదు

సికింద్రాబాదు - దక్కన్
30-10-1941

బై ఆర్డర్
ఎ. డబ్ల్యు. వాట్సు
చీఫ్ ట్రాన్సు సూపరింటెండెంటు

చందా వివరము

౧ సంవత్సరమునకు రు 6
౬ మాసములకు రు 3
బ్రిటిషిండియాలో
సంll చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

THE ONLY POPULAR PAPER THAT REACHES The masses in the Dominions

BEST MEDIUM for Advertisement.

*Volume* **16** **Hyderabad-Dn** **Monday 3rd November 1941** *Number* **50**



కొండా వేంకట రంగారెడ్డిగారు

౨౫ అబానుబాడు హైదరాబాదు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగారు కొండా వెంకటరంగారెడ్డిగారికి అడ్వకేటుదర్జానొసగిరి- రెడ్డిగారు రాష్ట్రీయములో సుప్రసిద్ధమగువకీళ్ళు వకీళ్ళపక్షాన శాసనసభలో ప్రతినిధులుగానుండినట్టి వీరున్యాయశాస్త్రములో అపారమైన విజ్ఞానము, పాండిత్యము అనుభవము సంపాదించినట్టివారు. వీరితోపాటు మౌల్వీఅబ్దుల్ రౌఫ్ అను వకీలుగారికిని అడ్వకేటుబిరుదము ఇచ్చినారు- ఈరౌఫ్ గారు ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంఘమునకు ఒకసంవత్సరం అహ్వాన సంఘాధ్యక్షులుగానుండి ఈసంఘములో ముఖ్య కార్యనిర్వాహకవర్గములో పనిచేయుచున్నట్టివారు.

## హైదరాబాదు యుద్ధసహాయం

## మరల ౨౫ లక్షలిచ్చినారు

హైదరాబాదు ప్రభుత్వమువారు నూటికి మూడురూపాయాల వడ్డీవచ్చు యుద్ధఋణమునకు ౨౫ లక్షలరూపాయాలిచ్చినారు- ఈ విధంగా ఇంతవరకు రెండుకోట్ల రూపాయాలిచ్చినారు

## సర్కారీ ఉద్యోగుల కుటుంబాలకు సహాయము

మ-మ-వ. నిజాంగారు కుటుంబసహాయనిధిని, పల్లీకభీమానిధిని ఏర్పాటుచేయుటకై అంగీకారమిచ్చినారు- మొదటిదిఉద్యోగి అకాలములో మరణించిన, వారికుటుంబ సహాయానికై ఏర్పాటుచేయబడినది- రెండవది ఒకసంవత్సరము తర్వాత కార్యరూపము దాల్చును- ఇప్పట్లోద యాధర్మముపై ఈకుటుంబ సహాయాలు ఆధారపడినవి- క్రొత్తశాసనప్రకారం ౫౫ ఏండ్ల వయస్సువరకు భీమాపద్ధతిపైఉద్యోగులవద్ద కుస్తులువసూలుచేయబడును- ౪౫ ఏండ్లనుమించిన ఉద్యోగులు తాముచేసిన భీమాకై నూటికి ౨ రూ॥ ఎక్కువగా ఇచ్చుకోవలెను, పైగా నూటికి ౬ రూ॥ప్రకారం కుటుంబసహాయానికై యిచ్చుకోవలెను- దానికి ప్రభుత్వమువారు నూటికి ౨ చొప్పున ఎక్కువగాయిత్తురు- ఈవిధంగా నూటికి ౧౦ రూ॥ అగును. ఈపద్ధతివలన ప్రభుత్వానికి ఏటేట ౪౦౦౦౦౦ రూ ఎక్కువ కర్చగును- ఇది పైఉద్యోగులకథ. చిన్న ఉద్యోగులనుండి నెలకు ౧ రూ॥ వసూలుచేయుదురు. ఇదికూడా కపిలితే ప్రభుత్వానికి ఏటేట ౧౧౦౦౦౦౦ రూపాయాలు వ్యయమగును. ఇనివరకు ఏటేట తిరిపింగా పెన్షనుదారులకుటుంబాలకు ౫ లక్షల సహాయము చేయుచుండెను.

## నవంబరు ౪ వ తేదిన జవాహర్ ఖైదుదినము

పండిత జవాహర్లాలు నెహ్రూగారిని ౧౯౪౦ నవంబరు ౪ వతేదీన ఖైదుచేసిరి దానిస్మరణార్థమై ఈసారినవంబరు ౪వ తేదిన జవాహర్ ఖైదు దినము నిర్వహించవలెనని సంయుక్తరాష్ట్ర కాంగ్రెసు సంఘముయొక్క తాత్కాలిక అధ్యక్షుడగు పురుషోత్తమ దాసు టాండన్ గారు నిర్ణయించినారు.

## మాష్టర్ శాసనం

పెద్దపెద్దజాగీర్దారులలో కొందరుకలిసి జాగీర్దారుసంఘపక్షాన హైదరాబాదు ప్రధానమంత్రిగారితో రెండునెలల క్రిందటకలిసి మాష్టర్ శాసనమును రద్దుచేయవలసినదని మనవిచేసుకొన్నారు. ప్రధానమంత్రిగారు వారిమాటలను జాగ్రత్తగావిన్నారు- అనుకూలంగావిచారించి ఫలితమును తెల్పి ముందు తెలుపుతామన్నారు- వచ్చినవారికి తేనీటివిందులిచ్చి పంపినారు.

### బి. జి. ఖేరుగారివిడుదల

పూర్వముబొంబాయిలో కాంగ్రెసుమంత్రి వర్గమందు ప్రధానముగనుండి శ్రీ కాంగ్రెసువారియుద్ధప్రతికూల సత్యాగ్రహము నాచరించి ఖైదుచేయబడిన బి- జి- ఖేరుగారును వారివలెనే ఖైదీచేయబడిన పూర్వపు బొంబాయికాంగ్రెసుమంత్రివర్గపు ఆదాయశాఖమంత్రి మురార్జిదేశాయిగారును అక్టోబరు ౨౯వ తేదిన ఉదయము జెయిలునుండి విడుదలచేయబడిరి- వారలుఅస్వాస్థ్యమునకు లోనైయుండిరి.

## ప్రకటన

చ ౨౫ ఆజూరు సన్ ౧౩౫౧ ఫ- రోజున నేనుతంగెళ్లపల్లిరాముస్వామి వమల్లయ్య సాకీన్ అంబర్ పేట, సాబకు పసుమాముల తా॥ ఫరక్ నగర్ ఇలాకే మహారాజబహదర్ నాపేర సర్వేనెం ౨౫ మువాజియె ౩-౧౨కం ౨౦గల జమీన్ కుష్కీ పట్టాయున్నది-అట్టిజమీన్ కొంతకాలమునుంచి నేను వదులుకొని అంబర్ పేటలో మకాంచేసియున్నాను- సుమారు ౧౫ సంllనుంచి గుడిగె రాజయ్య వల్దు మల్లయ్య సాకీన్ తారామతిపేట ఇలాకే సర్ఫెఖాస్ ముబారక్ ఖబ్జాలో నున్నది- ఇట్టిజమీన్ వారి ఖబ్జాలో ఇచ్చినప్పుడు విక్రయమూలకముగా ౯౦ రూపాయాలు తీసుకొంటిని-అందుకు ఈరోజు బైకాగితం తక్ మిలాజేసియుస్తిని- ముందు యీకాగితం మూలకంగా తాను పట్టా చేయించుకొని నాకుఉండు కుల్లుహక్కులు వారే అనుభవించవలసినది- ఇట్టికాగితము నాహోషుల ౦న్ భయము ఉండి బిలాజబర్ నాయిమపూర్వకముగా వ్రాయించియిచ్చినది సహీ-దీని ఏలాన్ గురించి గోలకొండపత్రికలో వేయించితిని- తారీకు సదరు- తంగెళ్ళపల్లి రామయ్య (తెలుముద్ర

## కళాశాలకు సెలవులేదు

హైదరాబాదులో మూడు ప్రజాసంస్థలవారు కళాశాలలను ఉస్మానియా విద్యాపీఠానికి లోబడి స్థాపించుచున్నారు- ఆ విద్యాలయానికిని ప్రభుత్వాన్ని కోరియుండిరి- ఏ ప్రజాసంస్థకున్ను కళాశాల స్థాపించుటకై సెలవిచ్చుటలేదని ప్రభుత్వమువారు ప్రత్యుత్తరమిచ్చినారని తెలియవచ్చుచున్నది- అందుఆర్యసమాజమువారు ఒకకళాశాలను నడుపుటకు సెలవడిగియుండిరి వారికిసెలవుఇచ్చుటలేదని ప్రభుత్వమువారు ప్రత్యుత్తరమిచ్చిరని దసరానాటిసభలో పం॥వినాయకరావు బ్యారిష్టరుగారుచెప్పినారు-

## హైదరాబాదులో ఆరోగ్యము

౧౯౪౧ అక్టోబరు ౧౧వ తేదితో ముగియు వారములో హైదరాబాదు నగరములో ప్లేగుయేమిన్నీ లేదు, ఒకకలరా కేసుఅయింది- ఒకచిన్నమశూచి జాడ్యం కేసుఅయింది- తట్టిఅమ్మారం, పంటాబాదు వగైరానగరుఅనుచుట్టుపట్టు గ్రామములలో ౧౨ కలరాకేసులైనవి. నిరోధకచర్యలవలంబింపబడినవి.



## వేగన్ల ఫిర్యాదు

"మిక్కిలి శోచనీయము, 16 గంటలనుంచి నిల పెట్టియుంచినారు ---

--- ఇంకా ఖాళీ చేయబడలేదు--

--నేను, ఇండియాలో!,, చాలదూరమునుండి సరుకుతెచ్చు కొనివచ్చినాను---

--- ఎందుకనగా, ఆ పోస్టాఫీసులు వారి స్టాకు ఆఖరు కాకుండుటకు!"

వేగన్లను త్రిప్పుతూ ఉండండి



Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B, L.